వ్యగ్రసమగ్రదీప్తినివహప్రవహద్దహనాంకురచ్ఛటల్. 174

క. "ఇది మాసాష్టకమున సి
ద్ధిద మిచ్చుటి కెవ్వ రేగుదెంచి తపమునన్
బొదలినఁ జెప్పుము నా కని
త్రిదశేశ్వర! నన్ను నంపితిరి తద్వనికిన్." 175

క. అని చెప్పినఁ "గలదు కలదు
నిను నట్లు వచించి యందు నిలిపితి" నని యా
యనిమిషవిభుండు చారుని
ననుప్రుచుఁ బిలిపించె రంభ నచటికి వేగన్. 176

క. పిలిపించి యవ్వధూటికి
నలఘుతరం బైనయట్టి యాతపసితపో
బల మెల్లఁ దాను జారుని
వలనన్ విని నట్లు చెప్పి వాసవుఁ డంతన్. 177

ఉ. "ఓలలితాంగి! యాతపసి యుగ్రత నింత నితాంత[1]దుర్గమా
భీలతపోధురంధరతఁ బేర్చుట నాసురరాజ్యలక్ష్మిఁ దా
నేలఁగఁ గోరి కావలయు నిప్పుడ దీనికిఁ బ్రత్యుపాయముం
జాలఁగ నెంచి చేయఁదగు సంశయ మంతయు మానునట్లుగన్.

క. చింత యొనర్పక యిది యొ
క్కింత యుపేక్షించి యున్న నె ట్లగునో? "గో
రంతాలస్యంబునఁ గొం
డంత ప్రయోజనము దప్పు" నన్ఁ గా వినమే. 179

క. విను మిట్టిపనుల కెంతయు
ననుకూలం బగుసహాయ మచ్చర లిపు డీ

1. దుర్గమా.

పని కరయ వారిలోనఁ
ఘనతరముగ నీకు నేర్పు కల దని తోఁచెన్. 180

సీ. కడునల్లికలుగొనుకలికిబిత్తరపుఁజూ
పుల క్రొమ్మెఱుంగులు వలలు గాఁగఁ
నెఱియంగఁ బర్వెడునిద్దంపు లేనవ్వు
తెలినిగ్గుతరఁగలు తెరలు గాఁగఁ
గోమరొందునవవిలాసములకన్బొమ లులి
వాడుచోపుడుఁగోల లగుచుఁ దనరఁ
దేనె లుట్టెడుమాటతేటలహసలు వా
కట్టుమంత్రంబులకరణి నమర

ఆ. నీవు గడఁగి యమ్మునీంద్రశార్దూలు త
పోమహత్త్వదర్పమును వారించి
కీరవాణి! యతనిఁ గ్రీడామృగంబుగాఁ
జేయవలయుఁ గుసుమసాయకునకు." 181

వ. అనిన విని యారంభ జంభవైరిం జూచి "యమ్మునీంద్రుం డనఁగ నెవ్వాఁ డని దేవరచిత్తంబున నున్న దియో? యతండు నారదశిష్యుం డైనమణికంధరుం డని మాకు వినంబడియె; నతని నిటమున్ను పరికించుచుండుదు మస్మదాదులవిలాసంబు లెవ్వియు నెన్నండును సరకుగొని చూచినవాఁడు గాఁడు; నేఁడు విశేషించి తపశ్చర్యాతాత్పర్యంబునం బ్రవర్తిల్లుచున్నవాఁడు గావున నవశ్యంబు దేవకార్యంబు నిర్వహింతు ననలే" ననుటయు, నతం డవ్వాలుఁగంటిం జూచి "నీకుఁ దొంటికంటె [1]వయోరూపలావణ్యవిలాసంబు లెక్కుడుగ

1. నవవయో. చూ. లేఁబ్రాయపుఁజెలువంబు. 3-25.

వరం బొసంగితి; సందియంబువలదు పొమ్ము; కార్యసిద్ధి
యయ్యెడు; నీచాతుర్యమహిమంబు నెఱపుము." 182

క. అనుపలుకుల నలరించుచు
ననుప మహోత్సాహ మాత్మ ననుపమలీలం
దనర మణీభూషణములు
దనరమణీయాంగకాంతిఁ దద్దయు మెఱయన్. 183

క. నెచ్చెలులఁ దాను ధరణికి
నచ్చెలువ కృతప్రయాణ యయ్యె నపుడ యా
యచ్చరపదువు బెడంగు వి
యచ్చరపదవికి మెఱుంగులై కనుపట్టెన్. 184

వ. అనిచెప్పి "దీనం జేసి యోకొమ్మ! యిమ్మహాత్ముని వాక్యపద్ధతియం
తయు సత్యంబ యగుట యెట్లొడియొ" నని పలికి యిట్లనియె.

శా. "ఏ నాసందన మంతటన్ వెడలి యిం చే తెంచితిన్ మున్న గా
నోనారీమణి యిప్పు డేగెడువిధం బూహించినం ద త్తపస్
స్థానం బింతకుఁ జేరఁ బోవుదుయ తద్వ్రంభాదులున్"నావుడుం
డా నాచిల్కవచోవిలాసమున కత్యంతంబు రంజిల్లుచున్.

సీ. "అఖిలంబునందు నత్యంతంబు వెలసి వ
ర్తిల్లెడుశుకసంజ్ఞఁ దేజరిలుచు
నత్యుదారాగమాఢ్య వ్యాసనందన
భూరియోర్జితానందముసఁ దనరుచు
ఘనపక్షవిలసనంబున హరితత్వంబుఁ
దెల్లంబు గాఁ జేసి యుల్లసిలుచు
నాయ నైసర్గికం బైనవిష్ణుపదైక
గతికత్వమునఁ జాల నతిశయిలుచు

తే. నున్న యొంచిల్క నీమధురోక్తిమహిమ
వీనుల కమృతరసములు వెల్లిగొలుపు
చునికి యుచితంబ మిగుల నీయోగవిభవ
మింత యం తని పొగడ నే నెంతదాన? 187

క. కావున నినుఁ బేడఁబాయఁగ
నోవిహగవరేణ్య! కొలుపఁ దుల్లం బైసం
బోవలయుఁ గదా నీకును
నీవనితం జూడ" ననుచు నెలఁతుక యనిపెన్. 188

ఉ. వాసుకిపూర్వజస్మకిటివర్యదిశాగజకచ్ఛపేంద్రఖే
లాసుఖసక్తతత్తదబలాహృదయాంతరసంతతాదరా
శాసితనిత్యభూభరణశక్తిలసద్భుజదండ కీర్తిసం
వాసితపద్మజాండ పరివర్ధితభూసుర కాంతిభాసురా. 189

క. కృష్ణతృష్ణానాయక శ్రీకృష్ణధ్యానామృతాబ్ధిఖేలనలీలా
తృష్ణ జ్ఞానయావహా,ధృష్టద్విషబలావధీరితభీమా! 190

మంగళమహాశ్రీవృత్తము.—

శీలితశుభాచరణ శిష్టజనతాశరణ చిత్రవిజయాభరణ యుద్ధా
ఖీలభుజవిస్ఫురిత భీరుదయనత్వరిత ప్రేమపద సచ్చరిత భావా
లోలకరుణాసహితలోకభరణావహితలోభకలనారహితవిద్యా
ఖేలనసముచ్ఛ్వసిత కేవలసుఖోల్లసిత కేశవనుతిప్రసితధీరా.

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ
పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయసూరయనామ
ధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బనుమహాకావ్యంబు
నందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# కళాపూర్ణోదయము

## తృతీయాశ్వాసము



నిత్యవిహారస్థల
తానుతలీలాకటాక్ష ధర్మవిధానా
నూనాపేక్షవిలాస
శ్రీనవ్యమనోజ నారసింహతనూజా. 1

[1]వ. అవధరింపుము. 2

క. అంతట సిద్ధుం డాసీ
మంతిని నీక్షించి "యేను మదిరేక్షణ మీ
చెంతకు వచ్చుట చెవులకు
వింతచెలువు గులుకుపాట వినుటకె సుమ్మీ. 3

క. కావున విపంచిఁ గైకొని
సేవించుక గానపటిమ నెఱపఁగ వలయున్"
నావుడు "నట్లుల కా" కని
యావిద్యం ద్రొద్దు పుచ్చె నతనిఁ సుగులన్. 4

వ. ఇవ్విధంబునఁ గలభాషిణి తనగానవిద్యాకౌశలంబున నతని [2]సుబుసు పుచ్చె; సంతకమున్న రంభాదులును మణికంధరుని తపోవనంబు దగ్గఱం జని యువనికి డిగ్గి రప్పుడు. 5

1. ఈవచనము లేదు. 2. యంబుసు.

చ. ఘనదచయంబుతో నలిగి వచ్చుచునున్న మెఱుంగుఁదీఁగెలో
యనఁగఁ దనూలతల్ మెఱయఁ దద్విరహంబున కోర్వలేక వెం
టన చనుదెంచుసంబుదగణం బన వేణిభరంబు లింపుగా
ననయము భూజనంబులకు నచ్చెలువల్ గనుపట్టి రంతటన్. 6

చ. కరపదపల్లవద్యుతు లకాలపుసంజ ఘటింపఁ దన్నఖ
స్ఫురణలు తారకానికరముం దలఁపింపఁగ వారిమోముఁదా
మరలబెడం గనేకవిధుమండలవిభ్రమకారి గైకొ మహీ [న్.
చరులకు నెల్ల నద్భుతము సౌఖ్యము నెంతయుఁ జేసె నయ్యెడ

క. ఇలమీఁదికి డిగి వేలుపుఁ
బోలఁతులు మణికంధరునితపోవనమున కిం
పలరఁ జనిరి తమచూడ్కులు
తొలుతగ నీలోత్పలములు[1]తోరణ కట్టన్. 8

వ. అంత. 9

చ. ప్రసవపరాగముల్ పసుపుఁబయ్యెదచాయపున నుల్లసింపఁ గ సు
ల్లసదళిపుంజముల్ కచకలాపములీలఁ జలించుచుండఁ బ
తీసముదయంబు భూషణవిశేషములుం బలెమ్రోయవారి కిం
పొసఁగ వనాంతలక్ష్మి ప్రియ మొప్ప నెదుర్కొన లేచెనో
యనన్. 10

చ. అళులుఁ గచంబులున్ లతలు సంగములుం బువుగుత్తులుంగుచం
బులును జిగుళ్లుఁ బాణులును బుష్పవిలాసము మందహాసముం
గలసి తడంబడన్ విబుధకామిను లావనలక్ష్ములందు శో
భలు మిగులం బ్రవర్తిలిరి పాలును నీరును బోలె నేకమై.

1. దోరణ.

సీ. ఆవులు నాకఁ గన్నఱమోడ్చుపులులును
బులులచన్ గుడువంగఁ బోవు లేళ్లు
లేళ్ల చెర్లాట రంజిల్లెడుహరులును
హరులు గోళ్లను గోఁక నలరుకరులుఁ
గరులకటాళి వైఖరి నాడుపాములుఁ
బాముల లాలించు బభ్రుతతులు
బభ్రుతతుల ప్రక్కఁ బాయనియెలుకలు
నెలుకలఁ బెంచుపిల్లులును గలిగి

తే. యపుడు వెఱఁ గొనరించె నాయంగనలకుఁ
గిరభాషితపోషితాఖిలతపస్వి
పటలతారక బ్రహ్మవిభావనంబు
భావితశుభావనంబు తపోవనంబు. 12

సీ. ప్రత్యక్షమైనట్టి పావనత్వంబు నాఁ
బుంజీభవించినపుణ్య మనఁగ
సాక్షాత్కరించిన శాంతరసంబు నాఁ
గరుడు గట్టినతపోగరిమ యనఁగఁ
గరువునఁ బోసినపరమసత్వంబు నా
రాశియై యున్నవైరాగ్య మనఁగఁ
గరచరణాదులు గలయోగవిద్య నాఁ
బూదె గట్టినతత్వబోధ మనఁగఁ

తే. బరఁగునమ్మౌనిఁ గనిరి తచ్చరణనఖర
చంద్రచంద్రికాముకుళితచారుహస్త
నలినసంగభృంగాయమాణభ్రమరక
నికర లగుచు నావేలుపునెలఁత లంత. 13

క. కని యాతనియసమసమా
ధినిశ్చలత నుగ్ర మైనదృష్టి కెదురుగాఁ
జనఁ గొంకుచు భయవశమున
వెనువెనుకకుఁ జని రొకింత వేలుపుచెలువల్. 14

ఉ. అప్పుడు రంభ చాలభయ మందుచు "నిమ్మునియుగ్రరూపముం
దప్పక చూడ మేనుగరు దాల్చుచున్నది యింద్రుకార్య మే
చొప్పున నౌనొకో! యరసి చూడఁగ నేరక యియ్యకొంటి నే
నిప్పని?" కంచుఁ బుద్ధిఁ బొరయించె దృగంచలచంచలత్వమున్.

క. తదనంతరంబ మగుడం
ద్రిదశాధిపకార్యమునకు ధృతి పాదుకొనన్
మది నిలిపి చెలులుఁ దానున్
ముదిత మెలఁగెఁ దత్సమీపమున వనకేళిన్. 16

ఉ. లోఁగక వార లవ్వనములో విహరించి రొకర్తు కొమ్మకై
యేగుచుఁ గమ్మపూఁబొదల నీఁగుచుఁ జేనియసోనవానలం
దోఁగుచుఁ దూఁగుటుయ్యెలలఁ దూఁగుచు సొక్కి సొక్కియు
గుత్తికిఁ, మూఁగుచుఁ గంతువీణె లన మ్రోఁగుచు నొండొరు
చేతు లాఁగుచున్. 17

సీ. "చిగురాకుఁబోఁడి యీ చిగురాకుఁబోఁడిని
మఱి లేదె మెచటికి మరలెదేమి?"
"కయ్యంబు వలదు నీ కయ్యంబుజాక్షితోఁ
గేలికి మఱియుఁ గంకేళిఁ గలదు"
"లీలాగుళుచ్ఛంబు లీలాగునఁ దెలిర్పఁ
గలహంసగమనరో! కలహమేల?"

"కుందరాజికి నింకఁ గుంద రాజీవాక్షి
యేటికిఁ! జాలు నీయేంటి కెల్ల"

తే. ననుపలుకు లెంతయును హాళాహళిఁ జెలంగ
రహి వసంతహిందోళాదిరాగకలిత
గానములు మీఱ భూషణక్వణన మమర
నమరకాంతలు విహరించు నవసరమున. 18

ఉ. అంచితలీల రంభ మునియగ్రమునన్ విహరించె నెంతయున్
మించునొయారమున్ గులుకునెన్నడయున్ విడఁ బాఱు
కొప్పు నొక్కించుక జాఱుపయ్యెదయు నిట్టటుఁ దూలెడు
హారముల్ మిటారించు కుచంబులున్ జలచరించువలగ్నముఁ
బొల్పు మీఱఁగన్. 19

వ. అట్టియెడ. 20

ఉ. దైవనియుక్తిఁ జేసి పరితాపం బగుచున్న మనస్సమాధితోఁ
భావనమూర్తి యాతపసి భామల యారొదవించు నక్షీప
త్మావళు లంత విచ్చుచుఁ దపంగనఁ గన్గొని దానిరూపు చే
తోవికృతిన్ ఘటింప ధృతితోఁ గనుమోడ్చి హరిం దలంచు
చున్. 21

ఉ. కొమ్మ బెడంగుసొంపుఁ గనుఁగొన్న కనుంగవ తత్తఱింపఁగా
నమ్ముని యాఁప నోప కపు డల్లన తెప్పలు విచ్చుఁ గ్రమ్మఱన్
గ్రమ్మఱఁ గృష్ణకృష్ణ యని గ్రక్కున మోడ్చు మగుడ్చుఁ
గ్రమ్మఱన్, గ్రమ్మఱ మారును మన్మథవికారము ధైర్యముఁ
గ్రుమ్ములాడఁగన్. 22

ఉ. అంతట భావికార్యఘటనానుగుణంబుగ నీశ్వరేచ్ఛచేఁ
గంతుఁడు మిక్కిలిం బ్రబలి కాంతపయిం బరఁగంగఁ జేసె న

త్యంతము మౌనిమానసముఁ బద్ధసద్ధైర్యకఠోరశృంఖలా
సంతతి యెంతయుం గుసుమశస్త్రికలం దెగఁగోసి వైచుచున్.

తే. దర్పకోగ్రప్రతాపసంతప్తమైన
తాపసునిచిత్త మప్పు డాతలిరుఁబోఁడి
చెలువ మనియెడునమృతంపుఁ గొలనిలోన
నోలలాడుచుఁ దిరిగిరాఁ జాలదయ్యె. 24

వ. ఇత్తెఱంగున బద్ధానురాగుం డగుచు మణికంధరుం డాగంధ
గజయాన యాకారరేఖావిలాసంబు లెంతయుఁ బరికించి. 25

తే. "రంభయే యిది కాదో? లేఁ బ్రాయపుఁజెలు
వంబు నుజ్జ్వలరూపలావణ్యములును
నగుమొగమునింపు నింత యెన్నఁడును గాన
దీని కీవింతమహిమ సంఘటిలుట యెట్లు!" 26

వ. అని యీపల్లవాధరసల్లాపపరిరంభణాదులకు నువ్విళ్లూరుచుఁ
దదీయలీలావిహారంబు లత్యాదరంబున నాలోకించుచుఁ దన
మనంబున. 27

సీ. "చెలువ మోమెత్త నాసికఁ జూచియో యింత
గతులఁబువ్వులు చంపకము సృజించె
వెలఁదికౌఁగిట నదె వికసించెఁ దొలుమేనఁ
గురవకద్రుమ మెంత పరవశమునఁగాంచు
గల్లున నందియల్ గదలంగ నదె తన్నెఁ
గాంత యక్కజ మశోకంబ యగును
నాతి కెంగేల నంటఁగఁ బులకించు చు
న్నది చూత మెంతపుణ్యంపుఁ దరువొ!

తే. యెంతజ ణయెు ప్రేంకణ మింతిపాట
కల రె నూర్పుదావులకు వావిలియుఁబో లె
మగువనగుచూపులఁ దనర్చుమ్రాఁకులార
పురుషతిలకవిఖ్యాతి మీ కరుదు గాదు. 28

క. ఆనెలఁత తేటమాటలఁ
దేనియ లుట్టుటలు తేట తెల్లము; యదిగో
దానికి గుఱు తామాటల
చే నల రెడుగోఁగులందుఁ జిప్పిలెఁ దేనెల్. 29

క. మగువముఖాసవవాసనఁ
దగ నలరఁగ నేర్చుఁ బొకతకు సుకవీంద్రుల్
పొగడం బొగడం బొగడం
బొగడంబుల కలరుతపలు పొగులవె లజ్జన్. 30

క. ఈనెలఁతతోడిసంగతిఁ
గాననియపప్రపదము గలుగుటకం టెఁ
దీనివిహారంబుల నిం
పూనెడువనతరువు లగుట యుత్తమ మరయన్. 31

మ. మునిధర్మంబుల కెల్ల పత్నిని జనంబుల్ నవ్వినన్ నవ్వనీ
ఘన మైనట్టితపోధనంబు నెఱయం గాఁ బోయినం బోవనీ
మునుముట్టంగఁ బ్రబోధవాసనల పెంపు ల్మాసినన్ మాయనీ
వనితారత్నముఁ గూడ కెట్లును దమిన్ వారింపలే నియ్యెడన్.

క. అని సాహసమున నాతం
డనుమానము లెల్ల విడిచి యచటు గదలి యా
వనజాక్షి వనవిహారం
బొనరించుసమీపమునకు నొయ్యన చనియెన్. 33

వ. ఇట్లు తార్చి. 39

తే. క్రొవ్వి కలహించుతు మ్మెదకొప్పమకదువు
[1]రాయిడిని గడుదళముగా రాలినట్టి
ప్రసవదళములు వఱవనిపఱపు లగుచు
నెసఁగ నిం పొందునాపొదరింటిలోన. 40

సీ. బెరు కెఱుంగనిగాఢపరిరంభముల నల్లి
బిల్లిగొంచుఁ బెనంగు పెనఁకువలను
బెరిఁగెడి పెరాసపేర్మి ననర్గళ
లీలఁ బర్వెడుకుచాస్ఫాలనముల
నడ్డమాఁకలు లేక యబ్బినయట్లెల్ల
నమరించునఖరరేఖాంకములను
గొదగొన్న తమిఁ గొంకు కొసరు లే కొనరించు
వివిధదంతక్షతవిభ్రమముల

తే. మన్మథావేశవిలసనమహిమ నెఱపు
లసనిఁ గని "సాదు రేఁగినఁ దల పొలాన
నిలువ దనుమాట నిజ మయ్యె నేఁ" డటంచు
మగువ నవ్వుచుఁ జేతకు మాఱు సేసె. 41

వ. ఆసమయంబున నటమున్న ద్వారకానగరంబునం గలకల
భాషిణిగానంబు వినుచున్న సిద్ధుండు తత్ప్రశంసాప్రసంగంబున
మణికంధరునిమాటఁ దడవుటయుఁ దలఁచుకొని యాచంచ
లాక్షి సిద్ధుని నభివీక్షించి. 42

తే. "అమరపతిసంపునను వచ్చినట్టిరంభ
కతన నే మయ్యెనో మణికంధరుని త

1. రాయఁడి.

పం బిపుడు మీార లటు ద్రృష్టిపఱపి చూడుఁ"
డనిన నొకకొంతతడ వతఁ డట్లు చేసి(సె). 43

వ. ఇట్లు దివ్యదృష్టిం జూచి.

క. నగుచు "సుక నేమితపమో
మగువ సలుపుచున్న వాఁడు మణికంధరుఁ డా
మృగలోచనతో నదె యొక
చిగురుంబొదరింటిలోనఁ జిత్తజకేలల్." 44

వ. అనిన విని కలభాషిణి యమ్మణిస్తంభునిబోధమహిమకు వెఱఁ గందుచు ననేకప్రకారంబులఁ బ్రశంసించి "యో మహాత్మ! యొకటిరెండుపూఁటలు మాయింట నిలిచి యేము సేయుపరిచర్యఁ గైకొనవలయు." ననిన నతండు "గాన లోభంబున నీభవనంబునకు వచ్చుటింతియ కాని, మఱి మీరువారును బలెఁ బట్టణంబుల నెట్టుకొని యిట్టునట్టు మహిమలు పచరించువాఁడను గాను. గూఢప్రకారంబున నిలుపనోపుదేని నీయుపచారంబులు గైకొనియెదను." నను టయు "నట్లు సేయుదు," నని తనగృహాంతరావసంబునందు నిలిపి యతిరహస్యంబుగా నాసిద్ధునకు నిష్టంబు లైనయన్నపానా దుల మోదంబు బొనర్చుచు నచ్చటికి నెవ్వరిం బోనీక తాన పరిచర్య సేయుచు రెండుమూఁడుదినంబులు హృదయంబు ఘంజిల్లఁ జేసి యంత సంతోషంగంబున సలసూబసంగమాభి లాష యతిశయిల్ల నతనిప్రియవనిత గ్గుణసంభ తెఱం గెఱుం గుటకుఁ గ్రమంబునఁ బ్రసంగంబు దిగిచి సిద్ధునితో ని ట్లనియె.

తే. "అనఘ! మణికంధరుం డట్లు తనదుతపము
విఘ్న మొందించుకొనుటకు వెఱ పొడమెడుఁ;

దిరుగఁ దప మొనరింపంగ దొరఁకొనియె నొ;
యిప్పుడు రంభతో నున్నాఁడొ; యెఱుఁగవలయు." 46

క. అనుటయు నతఁ డమ్మునిదిశఁ
దనదృష్టి నిగుడ్చి నగుచుఁ "దరుణి యిఁకఁ దపం
బనుమాట గలదె! యిదె యా
ఘనుఁ డున్నాఁ డిప్పుడు రంభ[1] కౌఁగిట" ననియెన్. 47

ఆ. అనిన "వార లింక నచ్చోటు వాసి పో
యెదరొ యుందువారొ యెఱుఁగవలయు
మఱియుఁ జూచి చెప్పుఁడు మాటికిఁ బదభివీ
క్షణము వెలయ నేఁడు శంక విడిచి. 48

ఆ. అనుడు "లేవు నాకు నాశంక లెవ్వియు;
నెన్నిమార్లు చూపు మన్నఁ జూతుఁ;
బడఁతి "కలదె జాతపతిమనుఁ జక్కిలి
గింత?" నాదుధృతికి కొంటు లేదు." 49

సీ. అని పల్కి మణికంధరునిదిక్కునందు దృ
ష్టి నిగుడ్చి గొక్కింత చెవియు నొగ్గి
యొకకేల మాట లాడక యుండఁ గలభాషి
ణికి సంజ్ఞ చేయుచు నిశ్చలత్వ
మున నొకించుకసేపు విని "యౌర వారకా
మినులమే లిట్టిదె!" యనుచు నగిన
"నది యేమి గొణఁగింపు" మని బాలతాంగి త
న్నయంబు నడుగ నిట్లనియె నతఁడు.

తే. "నీకు నే మని చెప్పుదు నీరజాక్షి!
యడఁచుకొనియెద నిక నవ్వడఁప రాదు!

---

1. కౌఁగిటిలోనన్.

పరమసంయమిఁ డా నట్లు *బతవము చెఱచి
మిగులఁ దుది రంభ చేసినతెగవు వినుము. 50

క. కళ లంటి [1]కరఁచి తనచె
య్యొలఁ జొక్కడుతనసినది చిప్పుక్కఁగ నునఁగా
"నలకూబర! విడు విడుఁ
యలసితి "నని పల్కె మన్మథాతివినవతన్." 51

మ. అనిచెప్పఁగా విని సిద్ధుఁజూచి "నగనేలా యింత భవ్యాత్మ! మా
వనజాతేక్షణ యేమి సేయునను? మహాభాగ్యసౌభాగ్యవ
త్తస నరేశుకుమారుఁ డంతరమిాగాఁ న న్నేలుఁ బాలు! నా
యన తా ని త్తఱి సట్టివల్లభకు దవ్వై గొంటు నున్నాఁడో కో!

వ. అతనిఁ బరికించి చూడవలయు." ననుటయును సిద్ధుండు నప్పుడు
"నీ కిదియ కదా ప్రధానప్రయోజనం" బని పల్కి, యటు
నటు పరికించి చూచి యతఁ డున్నచోటు గని కలభాషిణి
కి ట్లనియె. 53

ఉ. "తా వెనువెంటఁ బాయక సదా చరియించినఁ గిన్నెనోవమో
దావృతిఁ జిక్కి రంభ తగిసట్టితపోహతి సల్పలేదు; కో
పావహ మింద్రుబుద్ధి కది; యట్లగుటం బ్రియుఁ గూడియుట్టికా
ర్యావసరంబులందుఁజనఁడాతఁడు; నూతఁడు సన్న్యరాలిచేన్.

క. కావున మణికంధరునిత
పోవనముసమిాపభాగమున నొకవనిఁ బూ
తావళిలో నున్నాఁ డదె
పూవులను జిగుళ్ల నొప్పుభూజముక్రింద." 55.

వ. అని చెప్పి యి ట్లనియె. 56.

---

* పరము. 1. కఱఁచి. 2. వనచూతావళిలో.

క. "తరుణీ! యిపు డాతనిపైఁ
బరాకుచే నీవు గానపాటవగుణముం
గరము మెఱయిం[1]ప వేనే
నరిగెద మఱి లేద యితర మగుపని యిచటన్. 57

తే. అంపితేఁ బోయి వచ్చెద." ననుటయుఁ గల
భాషిణి "మహాత్మ నిన్ను నాపాలిభాగ్య
దేవతగ నమ్మియుంటి; నాజీవితంబు
నేమిగాఁ జేసి పోయెద వెఱుఁగఁ జెప్పుమ." 58

చ. అనుటయు "నన్ను నిప్పు డనునట్టిదియెయ్యది నాకుఁ జెప్పుమా
వనిత! క్రమక్రమంబునను వచ్చినయట్టుల వత్తుఁ గాక!" నా
విని "బళి! లెస్సమాట యిది వేఱొకనాఁ డిఁక మీరువచ్చియే
ననుఁ గృపఁ గాచుటల్? వినుఁడు నామదిలోపలిచంద మేర్పడన్.

క. ఈవేళన యాతనికడ
కేవిధమున నైనఁ జేర్చు టింతియతక్కం
ద్రోవ మఱి లేదు నన్నుం
గావన్ క్షణభంగురములు కాంతలతాల్ముల్." 60

క. తదుపాయము దిద్దుటకున్
మది నెన్నఁ బ్రభావఘనులు మఱి లేరు మహో
భ్యుదయానుభావగుణసం
పదఁ బొదలినమీరుదక్కఁ బావనచరితా! 61

చ. అన విని సిద్ధుఁ డిట్లనియె "నంబుజలోచన! నిన్ను నేఁడ యా
యసకడఁ జేర్చునంతటియుపాయము నేర్చిన నేను డాఁతునే?

---

1. ప లేపే.

యనుకొనరాదు గాక నిసుఁ బ్రాణవిభుం డగఁ గూర్చి ప్రోదియా
వెనుకటినీదుపాట విను వేడుక నెట్లగుచున్నవాఁడనో! 62

తే. చింత సేయుము సీవ యనంతశయన
పద్మనాభసమీపభూభాగవర్తి
యైనకోఁజేరి యొక్కడ; యతని ద్వార
కాజనులు నేఁడ చేరు టెక్కడ లతాంగి! 63

క. మించుగ మాగురువులు శి
క్షించిన యీయొక్కరింతసింగమునకు నూ
హించవ నొక నాల్గడియల
సంచారము వలయు నతనిసన్నిధిఁ జేరన్. 64

వ. సీను కెంత్రవలసిన నేమి? యిది తడనం బని లేదు. నిన్ను
నీనిష్ఠ నునిచికొనిపోయెద నంటినేని, యోపూఁబోఁడి!
తోడిసిద్ధు లిది వేఱొక్కలాగుగా నెంతు; రెవ్వరి యంత
స్సారం బెవ్వ రెఱుంగుదురు? పదిరుసుం గాక, మీబోంట్ల
సంస్పర్శమాత్రంబు నస్మదాదులకు సమ్మతింప నుచితంబు
గాదు; మఱి వేఱొండుసామర్థ్యంబు లేదు. నాకుఁ గల
దూరదృష్టి దూరశ్రవణ[1]శక్తి యిం దేమియు నుపకరింప
దింక నీవు చెప్పినప్రకారంబు గావించుటఁ జెప్పు.” మనుటయు
నాసిద్ధునకుఁ గలభాషిణి యిట్లనియె. 65

సీ. “ఓసిద్ధపురుష! మీ రేసరణిని గాని చన్న
నే మగుఁ? బక్కశంక గలదె?
నీమహత్త్వముఁ గాననిజడాత్ము లేమన్న
నేమి? కన్నమహాత్ము లించుకయును

1. శక్తు లిం దేమియు నుపకరింప వింక.

వేఱొక్కగతిగ భావింపర మమ్ముఁబోంట్ల
సంస్పర్శమాత్రంబు సన్నుతింప
నుచితంబుగాఁ జంటి రుచితంబె మఱి నాదు
ప్రాణహానికి నోర్చు టరసిచూడఁ?

తే. బలుపలుకు లేల? యింక నా చెలులు గిలులు
నేఁగుదెంచి విఘ్న మొనర్తు రిత మెఱుఁగక
గావునం గొనిపొమ్ము శీఘ్రింబ నీదు
వెనుక నిడుకొని నన్ను మస్వ్యోఘనికడకు." 66

సీ. అన నియ్యకొని సిద్ధుఁ డరు దైనపులితోలు
పల్లంబుతోడ నిబ్బరపుబిగిని
బొట్టపట్టెడ గాఁగఁ గట్టిన పెనుఁబాఁప
తట్టంబుతోడ వాచపుఁబసిండి
యంకవన్నెలతోడ సంకుపేరులతోడ
వశ్యౌషధపుఁదీగె వాగెతోడ
నేకపార్శ్వమున భల్లూకచర్మపుటొఱ
ఘటియించినట్టిబల్లత్తితోడ

తే. వఱలునేనిపిండి వార్వముదు దోలుతఁ
గాఁగఁ దానెక్కి "నన్ను డాఁకకయ దీని
కటివిభాగంబు నెక్కి రాఁగలవె యబల
వెనుక మసగొమ్ము నూఁతఁగాఁ గొనుచు?" ననియె. 67

క. అన విని "యీపాటిగ మీ
యనుగ్రహము గల్గి యుండ నక్కట యింక నేఁ

జనుదేక 'యేమి?" యని తన
కనువుగ వారి నతఁడు నిలుప నంగన యెక్కెన్. 68

తే. ఎక్కి "సిద్ధేశ యెవ్వరు నెఱుఁగకుండ
నెట్లు గొనిపోయెదో?" యన "నేల శంక?
యొందు నెద్దులు బండియు నేకమైనఁ
గొండమీఁదికిఁ బోవునో కొమ్మ" యనుచు. 69

క. నింగికి "ఛే!" యని కదలిం
చెం గడు వడిగలుగుతనదుసింగముఁ బలుమా
ఱుం గలభాషిణిఁ దేఱి క
నుంగొని "పదిలమ్ము సు"మ్మనుచు శీఘ్రగతిన్. 70

ఆ. మగులుగోడమీఁద మ్రాఁకులు చిగురుజొం
పములు వానిమీఁదఁ బ్రచురదోహ
దములధూపములును దనకు మాటుగ గూఢ
గతిని గాంతఁ గొనుచు నతఁడు సనియె. 71

చ. చని చని యెక్కుచో నతఁడు [1]చాలుగ నక్కజ మందుచుం
గనుంగొనఁ దమమేఘరంజిఁ బొదిగొన్నఘనావళిలోననుండి
డా, రున నెదు రైరి వైభవనిరూఢిఁ జెలంగెడుకొండపంగ
నల్, ఘనతరచాతురీమధురగానకళాకలనాకలాప లై. 72

క. తమపాటఁ జినుకుచినుకుల
దుమదుమగాఁ దడిసినట్టిదువ్వలువలతో
గుమగుమ యనుపరిమళబృం
దముతో నప్పు డొకయింపొనర్చిరి వారల్. 73

---

[1] చాలఁగ.

వ. ఇట్లింపొనర్చుచు నెదురైన నతండు వారిని సంభాషణా
క్రమంబున రంభాసఖు లగుట యెఱింగి "యిది యేమి
యనుంగునెచ్చెలి నచ్చట విడిచి వచ్చితి? రచ్చెలువ మణికం
ధరుమీఁది యనుగ్రహంబు వదలక యింకనుం గొన్నినాళ్లు
తద్వనంబున నిలుచునో?" యనుటయును నగుచు వార లి
ట్లనిరి. 74

క. "ఎక్కడిమణికంధరుఁ? డతఁ
డెక్కడఁబోయెనొ యెఱుంగ? మిపుడు ముదముతో
నక్కొమ్మ పొదలుచున్నది
తక్కక నలకూబరుండుఁ దానున్ రతులన్. 75

చ. ప్రియునిసమాగమోత్సవము పెంపున నింపలరారునామృగా
క్షి యిపుడు తద్వనిన్ రతివిశేషముసొంపులఁ జిక్కి యున్కి
యా,రయుచుఁ దదిష్టమున్ విడిచి రమ్మనఁ జాలక యాకె
నుంచి యే,మ యరుగుచున్నవార" మని మానిను లచ్చటు
వాసి పోవుచున్. 76

క. "వేళాకోళపుఁదీఁగలుఁ
బేలికలుఁ గళాసములును బీఱ[1]జడలుఁ దాఁ
దాలుచు నెట్లొకొ మింటన్
లీలాహారిఁ దోల నింత నేర్పరి యయ్యెన్! 77

క. ఎక్కడ దొరకెనొకో యీ
చొక్కపుగుబ్బెత [2]బెడంగుబోగికి? నహహా
యిక్కలికి గుత్తగొనుఁ బో
తక్కక దివి నిమిషమున్న దైవతవిటులన్!." 78

1. జడలుచుం. 2. వెడంగు.

వ. అని చెప్పికొని రంత. 79

క. నలకూబరుండు రంభం
గలయుట విని చిన్నవోవు కలభాషిణిరీ
తులు దిరిగి చూచి "దీనిం
గలఁచెర యివ్వార్త తాపకరమై" యనుచున్. 80

ఉ. సిద్ధుఁడు నవ్వి "యోచెలువ చింతిలఁగా వల దిప్పు డెంత
యుఁ, బుద్ధిఁ దిటంబు గాఁగ ధృతిఁ బూను మొకించుక నేపు
లోన నే, శుద్ధముగాఁగ నీమనముశోకము సర్వముఁ
బుచ్చి వైచెదన్, సిద్ధము నామన" ట్లనియెఁ జెల్వయు
మోము వికాస మందఁగన్. 81

క. "ఏరీతి నింతమిక్కలి
నేరికగా నాడి" తనియె సిద్ధుఁడు "చూడం
గారాదె కుదువఁ బోవుచుఁ
గూరలచవియడుగ నేల? కోమలి" యనిగొనెన్. 82

క. కంఠీరవ మట్టిరొకం
గంఠం బెగ నెత్తి చూచి కదలక నిలిచెం
గుంఠితగతిగ్గొ యొందు న
కుంఠితగతి యనఁగఁ దొల్లి గుణము నెఱపియున్. 83

వ. అప్పుడు. 84

సీ. హుంకారముఁ తోడ నుచ్చాటనపుబస
నికటిఁగతఱటుపట్ల వ్రేసి వ్రేసి
కడుదాక మీఱంగ మడమలు దాఁటించు
చును ముందటికి లివ చూపి చూపి

మొగము పార్శ్వములకు మగుడింపకుండ వా
కట్టుమూలికవాఁగెఁ బట్టి పట్టి
వడి నూర్ధ్వగతిని లేవకయుండఁ దననాగ
బెత్తాన మూర్ధంబు మొత్తి మొత్తి

తే. సిద్ధుఁ డధికప్రయత్నసన్నద్ధుఁ డగుచు
నెంత చేసిన నాసింహ మెదుటికడుగు
పెట్టదయ్యెను [1]గర్జావిభీషణముగఁ
దోఁకఁ ద్రిప్పుచుఁ గడువెన్కఁ ద్రొక్కఁగాని. 85

ఉ. అప్పుడు చాల సంక్షుభిత యై పడజాతి "యిదేమి దేవయా
యిప్పుడు దీనిచంద?" మనియెం గలభాషిణి [2]మేచెమర్పఁగాఁ
గొప్పు విడంగఁ బాఱఁ జనుగుబ్బలఁ బయ్యెద వాయ సుస్థితిం
దప్పి పిఱుందు పల్లటిలఁ దా మరగొమ్మిరుగేలఁ బట్టుచున్.

వ. సిద్ధుండు నంతఁ బద్మినీనిరోధకారణంబుం దలంచుకొని యా
చంచలాక్షితోడ. 87

క. "తరుణి! వెఱవకు పల్లపు
మరగొమ్మెపఱకు నాకు మఱ ద్యదాపి
స్మరణం బైనది మాటల
పరికుచే" ననుచుఁ దనదుపారీంద్రంబున్. 88

వ. కొన్ని యడుగులు జరుగఁ బట్టి ధరణిపై డిగఁ దోలుకొనివచ్చి
యచ్చట నచ్చెలువతోడ నవరోహణంబు సేసి కేసరిని
మేఁతకు విడిచి "యోపడఁతి యీ ముంపరినికటంబునంద
మృగేంద్రవాహన యనుశక్తిగలదు. తన్మందిరంబు ముందఱ
నున్నమృగేంద్రంబునకుఁ గ్రిందిమీసం జొట్టుపట్టున నొట్టి బెట్టి

1. గర్జాది. 2. మైచెమ.

దంపు సింగంబులుం జన వెఱచు నివి మఱచి యే నెంత తోలిన
మనవాహనం బచటి [1]కట్టెదుర నడచు; మనము నమ్మహాశక్తికి
నభివందనంబు సేసి పోయినం గార్యసిద్ధియగు; ర మ్మనుచు
నల్లనఁ దనభల్లూకచర్మకోశంబుతోడి ఖడ్గంబు పుచ్చికొని
సింగపుఁ[2]బిల్లనము పోక యక్కడన యొక్క మఱుంగున డాఁచి
యాచపలలోచనను మృగేంద్రవాహనగుడికిం దోడ్కొని
చని తద్బాహ్యమంటపంబున నునిచి "యద్దేవి పూజకుఁ
బువ్వులు దెచ్చెద" నని పూఁదోఁటకరిగె నప్పు డత్తెఱంగు
గనుంగొని. 89

సీ. పసిమి పో నెండిన కసవుగుట్టలఁ బోలె
నరవెంట్రుకలు గప్పు వాసములవలన
సులి గొన్న చెలఁదిపుర్వులసూలిన వ్రీలు నా
సము రెడు ముదుతకసర్పములవలనఁ
గడుఁ జిల్లినెట్టబంగరుపూఁత పోల్కి
వడువు సూపెడి మేనిపళ్ళలవలనఁ
దునిసి ప్రేలెడు వ్రాఁకుతునకలఁ బిలిపించు
బాహుపక్షోజలంబనములవలన
తే. ఘోరరవములఁ జాడ్పున ఘోరవృత్తిఁ
దనరు ఘనకాసకుహకుహాధ్వనులవలనఁ
భావజుఁడు వెళ్లి పోయినపాడు మేడ
పగిదిఁ గాన్పించు ముదుసలి పడఁతియొక తె. 90

క. కలభాషిణిఁ జేరఁగ వ
చ్చి "లతాంగీ! యొచటనుండి యేరితి వచటం

1. కెట్టెదిరి నడచు. 2. బిల్లంపుసంబోకలతోడ నదయొక మఱుం.

కలుషపుబాపురుఁ బిల్లిని
జిలుకయుఁబలె నిద్ధరాత్ము సిద్ధుం డనుచున్. 91

ఉ. ఎంతయు వింతచెల్వమున నివ్వన మెల్ల నలంకరించుచుం
గాంతత నొప్పుమేనిపసఁ గన్నులపండువు సేయు నిన్ను న
ల్లంతన చూచి "దైవ మకటా దొరకించెనె యిట్టినిర్దయ
స్వాంతునిచేతి కీభువనసారము" నంచుఁ గడుం గలంగితిన్.

క. ఆకలుషాత్ముఁడు క్రమ్మఱి
రాకమునుపె తొలఁగి పోవరాదే యెట కే
నోకూన యీమనోజ్ఞత
రాకృతి యేఁ జూడఁ జాల నసిపాల్ గాఁగన్! 93

తే. అమ్మ విను మింక నొకయించుకంతతడవు
నీతెరువుఁ జూడ నీపేరు నీతెఱంగు
నడిగి పరికింప మది యున్న దైనవాఁడు
రాకమును నీవు తొలఁగుట నాకుఁ బ్రియము. 94

శా. నీ కెంతే నితఁ డాప్తుఁడో జనకుఁడో నెయ్యంపుఁదో బుట్టువో?
నీకార్యార్థమె పూని తా నెచటికేనిం గొంచుఁ బోచున్నవాఁ
డో? 'కాఁగా దిటునంటెపల్కనక తోడ్తో నింతబెట్టాడ నే
నో కాంతామణి! వెఱ్ఱిఁగా నితనిచెయ్యువ్వల్ మున్ను వీక్షిం
పుదున్." 95

వ. అనుపలుకు లన్నియు విని కలభాషిణి తనమనంబున. 96

క. "ఈయవ్వవాక్యములు దలఁ
పోయఁగ నాయుల్లమునకుఁ బొందుపడినయ
ట్లై యున్నవి యీసిద్ధుఁడు
మాయవిదో యొక్కమాట పడి నూహింపన్. 97

తే. "ఇంక నొక్కింతసేపున కెల్ల వగపుఁ
బుచ్చి వైచెద" నని పల్కె నిచ్చఁ దెకిసి
జేరునపు డది యీయమ్మ చెప్పినట్లు
శక్తికిడియొడు ననుట నిస్సంశయంబు. 98

సీ. ప్రజల కందఱకు నాపసలు వాసించునట్టి
చక్రిపట్టణములో జనన మంది
వారకామిని నయ్యు గౌరవంబున సత్క్య
జను లిటు చేర గణ్యనగఁ బ్రదికి
త్రైలోక్యగురుఁడు నారదమౌని ప్రియశిష్య
నిర్విశేషముగ మన్నింప నలరి
జగదీశురాణివాసపుసతుల్ తమకుఁ గా
వింపంగ సంగీతవిద్య నేర్చు
తే. తున లోకానలోకకటకనిగ్గు వెలసచ్చు
శక్తిపూజకుఁ బలు నైలిఁ జెప్ప సేయు
నెంతవారికిఁ దప్పింప నెట్లు వచ్చు
బ్రహ్మ దా మున్ను వ్రాసిన వ్రాఁతఫలము!" 99

క. అని మది నడలుచుఁ బ్రియసఖు
లను మొఱఁగుట పలఁచి కనుల గలంగుచుఁ "దెగునే
యనుభావ్య మెంత యంతయు
ననుభవమునఁగాక!" యనుచు సనయముఁ గుందెన్. 100

వ. తదనంతరంబ డెందంబు దిటవు పఱచుకొని ధైర్యబలంబునఁ
గంఠగద్గదిక వారించుచు నాస్పష్టభాషిణితో నిట్లనియె. 101

శా. "అమ్మా నీపలు కెల్ల నెంతయు నిజం బై యిష్ట గాన్పించె నే
నిమ్మాయావిప్రకార మిట్లగుట యూహింపంగ లే 'కొక్కయ

గమ్ముగ వీనికృపం గడింతు'నని యత్యంతాశ ప్రేరేపఁ గా
నిష్ఠాడ్కిం[1]చెగి వచ్చితిం దెరువు లేదీపాటు దప్పింపఁగాన్.

క. ఎక్కడికిఁ బాఱిపోయెదఁ
జిక్కుపడక యేను వీనిశీఘ్రగతికి నో
యక్క యిఁక దూరదృష్టియు
నెక్కుడు వీనికిని గాంచు నెచ్చట నున్నన్." 103

సీ. అన విని యాకె "యోవనిత! నీవు నెఱుంగు
దే వీని యాదూరదృష్టి?" యనిన
"దానన కాదె యీతఁడు నన్ను బ్రమయించి
యీరీతిఁ దాఁ దెచ్చె నిచటి" కనుచుఁ
బలికి యాతఁడు తన్నుఁ బ్రథమంబునందు గృ
హారామమునఁ గాంచు టాది గాఁగ
నది తుద గాఁగ సమస్తంబు వినిపించి
తత్ప్రసంగంబునఁ దనదు పేరుఁ

తే. గులము విద్యయు నప్పటికోరికయును
జెప్పి "యాకోర్కి సాధించుచింతఁ దక్కు
చింత యెఱుఁగక యేఁగు దెంచితిఁ గొరకకుఁ
బోవఁ బడిగల్లు వడియె" నోపొలఁతి." యనియె. 104

చ. అన విని "యట్ల యౌ నిది యథార్థము నీ కటు లాస చూపి
తోడ్కొని చనుదెంచెఁ దాఁ దనదుకోర్కి యొనర్చుట
కీవినిఁ బ్రవర్తనుఁడు మనుష్యయత్నమునఁ దక్కఁగ నేరఁడు
దూరదృష్టి సాధన మయినట్టిపిమ్మట నితం డొనరించువిచార
మారయన్. 105

---

1. దెగి.

వ. అది యెద్ది యంటే నప్పు డితండు. 106

తే. "ఇంతపాట్లను బడి కన్న యీవిచిత్ర
మహిమకుం బగ రాజ్యసంపదలు గనిన
నెంత యింపగునో" యని యేను వినఁగఁ
బలుమఱును వీఁడు ముచ్చటపడుచు నుండు. 107

క. ఆకోరికకై "కల దొకో
లోకోత్తరగానయుతయు లోకోత్తరస
మాకృతియు నొకతె వార
స్త్రీకులమున" ననుచు దూరదృష్టిఁ వెదకున్. 108

క. తానును గిన్నర యొకతెను
హానంబత మీటుచుండు ననిశంబును స
ద్గానరసజ్ఞత నిలఁ గల
గానము దూరశ్రవణముకతమున నరయున్. 109

వ. అని చెప్పిన వృద్ధవనితకుఁ గలభాషిణి యిట్లనియె. 110

సీ. "తొల్లి యిచ్చటన యాదూరదృష్టియును దూ
రశ్రవణము నిద్దఱు రత్నకుండు
సాధించినాఁడె? తత్సాధన కెందఱెం
దఱకు త్తుకలు గోసి చెఱిచె నొక్కొ!
యది కొంత యెఱుఁగుదే నంగన గొఱఁగింపు
వినియెదఁ గాలయాపనముకొఱకు
మీఁదటఁ గాఁగలమేలుగీళ్లేరికిఁ
దప్పింపరాని యెంతయు ధ్రువంబు

ఆ. 'ఇంక వాఁడు వచ్చి యేమేమి సేయునో
చచ్చు టెట్లొ' యనువిచారమునను

బెగడు చుండ నేల జగదంబ యీశక్తి
సేయవలసినట్లు సేయుఁ గాక." 111

క. అన విని యాయమ మెచ్చుచు
"ఘనధైర్యవివేకమహిమ గలయుత్తమభా
మిని వౌదు మేలు మే లీ
వనినట్ల వచింతు నీకు" నని యిట్లనియెన్. 112

క. "ఓరమణి దూరదృష్టియు
దూరశ్రవణంబుఁ బడయుత్రోవ లితరముల్
ఘోరముల య్యెనఁ బరహిం
సారూపంబు లవి కావు సాహసవిధుల్. 113

క. ఆ రెండు నితఁడు వడసెం
గోరిక నలగోరుగల్లుఁ గొని నిజనయనో
ద్ధార మొనర్చియు వీనుల
ఘోరపునారసముఁ బఱపుకొనియుఁ గ్ర వరుసన్. 114

వ. అనుచుఁ [1]దన్మంటపాగ్రభాగంబున మృగేంద్రవాహనంబు
పండ నేకాక్షరపంక్తిచిహ్నితశిలాస్తంభంబున వ్రేలఁ గట్టిన
యాశస్త్రయుగ్మంబును మఱియు నచ్చట గంధపుష్పాద్యర్చి
తంబులై యున్నయొక్కచురియయు గండకత్తెరయు డగ్గఱం
దోడ్కొని పోయి చూపి యిట్లనియె. 115

క. "'ఈకోరిక కిది తెరు విది
యీకోరిక' కనుచు వ్రాసి యిడినా రదె యా
ఆకంబంబునఁ జదువుము
నీ కాలిపి తెలియునేని నీరజవదనా!" 116

1. దన్మందిరాగ్ర.

సీ. అనుచు నమ్మాట దా విని కలభాషిణి
యందు నున్నర్థ మిట్లనుచుఁ జదివె
"యిచట రెండేండ్లు జితేంద్రియత్వంబున
భువనేశ్వరీమంత్రమును జపింప
నెల్లకోర్కులు నిచ్చు నిష్టదేవి గూర్చి యుష్ణ
గాక సద్యస్సిద్ధి గావఁజేసిన
మహాపవిత్రార్థ యాగోత్సుకగంట హోత్రాగ్నుః
డయ్యు దూరగ్రసనార్థ చెవిని
తే. ఘోర మైనట్టియీబలునాసనంబు
నొప్పుకొనియు సారస్వతప్రాసనార్థి
యీసురియచేత నాలుకఁ గోసికొనియు
నిమ్మహాశక్తి మెప్పించి యిష్టమొందు. 117

క. ఈమెఱుఁగుగండకత్తెర
చే మిడిపల యిచ్చుసాహసికుఁడు శిరంబు
ట్టే మగుడఁగ నదుకుకొనం
గా మని చంపుఁ దనుఁ జెలఁగఁ గడఁగినవానిన్. 118

క. పదిలముగ నిర్విఘ్నా
భ్యుదయమహారాజ్యలక్ష్మిఁ బొంగుచు నశితక్ష
సపములరూపసుగానా
స్పద వారవధూటి నిచట బలిగా నిడినన్." 119

తే. అని చదివి దానఁ గలఁపులో నాత్మనిధన
శంక నిస్సంశయం బయి చాలఁ బ్రబలఁ
గలఁగి చలియించుతద్దైన్యగౌరవంబు
నంతన మగుడ్చి కడమ యిట్లనుచుఁ జదివె. 120

ఉ. "ఈవిధులందు నెంచునఁ నొకింత సమగ్రత లేనివృద్ధు లి
ద్దేవతయొద్ద నిర్భయత దేహము నెమ్మెయిఁ బాసినఁగా లస
ద్ధ్యానసరూపసిద్ధి యగు నప్పుడ యంగవిమోక్షవేళ ని
చ్ఛావృత మెద్ది వారి కది సంఘటిలుం జిరమై తదాదిగన్."

క. అని చదివిన నంతఁ దమిఁగా
విరఁబడినవిధానమునకు వృద్ధాంగన యిం
పున నవ్వుచు "నిది విని సు
మ్మనితము నే నిచట నునికి యంబుజనయనా! 122

తే. అబ్జముఖి సుముఖాసక్తి యండ్రు నన్నుఁ
గరము కాశ్మీరభూమిఁ బ్రఖ్యాత మైన
శారదాపీఠమున సరస్వతిని గొల్చు
నట్టిపూజరిబ్రాహ్మణుపట్టి నేను. 123

వ. అనునంతట సిద్ధుండు దేవీపూజకుఁ దగినగంధమాల్యాదులు సంపాదించికొని వచ్చి యమ్ముదుసలిపడఁతిం జూచి, "యో యవ్వ! కుశలంబున నున్నదానవే? నిర్మనుష్యం బైనయీ శక్తిస్థానంబునఁ జిరకాలంబునం బట్టి యెట్లు వేగించుచున్నదాన?" వని పలికి కలభాషిణిం బిలిచి, "యోచెలువ! మనకు నవ్వల చనవలయుఁగద; మిక్కిలి ప్రొద్దు పోవుచున్నయది; శక్తిం బూజించి పోవుద మాయమ్మచేత ననిపించుకొని ర"మ్మనుటయు నది భయాకులమానస యగుచు వృద్ధాంగనం జూచి. 124

క. "ఏ నొంటిఁ బోవ వెఱతుఁగా
లోనికి నోయమ్మ! నీవునుఁ రాఁగదె నా -

తో" నన "నెవ్వరు నేటికి
నే నుండఁగ" ననుచు సిద్ధుఁ డింతిం బలికెన్. 125

సీ. పలికి యప్పటిదానిభయచేష్ట భావించి
"యిమ్ముదిజంతచే నిది యొకింత
యే మైన నాతలం పెఱిఁగెఁగాఁబోలు వి
ఘ్నం బేమి యగునొ విలంబ మైన"
నని సిద్ధుఁ డాత్మలో ననయంబు వేగిరిం
పుచు "నోసిబెల్లి! యిమ్ముసలివగ్గు
నీకుఁ దోడ్తై వచ్చునో? కలదో మఱి
యే మైన" ననుచు నాయిగురుఁబోఁడి

తే. కొప్పువట్టి తివంబోవ నప్పుడింతి
ప్రాణభయమునఁ గలఁగి "యోయయ్య! నీకు
బిడ్డనే కావవే నాకు నడ్డపడవె"
యనుచు నావృద్ధనారిమాటునకు నొదిఁగె. 126

క. ఆవృద్ధనారియును గరు
ణావిలమతి యగుచు నాభయార్త మృగాక్షిం
దా వెనుక నిముడుకొనుచుం
"గావుము కావు"; మని వానికరములు పట్టెన్. 127

సీ. పట్టిన నతఁడు "లోపలికి రాకుండ వి
ఘ్నము సేసె; దింతియ కద!" యటంచుఁ
"వద్దేవి కిచటు ముందర గాదె!" యంచు న
ప్పడఁతిచేతులు నుల్చి పాఱఁ ద్రొబ్బి

బలిమిఁ దార్కొని కలభాషిణివేనలి
యొకకేలఁ బట్టి వే ఱొక్కకేల
నాఁగ త్తి వెలికి "నీ కొప్పన మిదె" యంచు
సత్తికిఁ గత్తిచే నెత్తి మ్రొక్కి
ఆ. ప్రేయఁ బూన, "[1]దీని వ్రేసితే నిద్దేవి
యానసుమ్ము నీకు!" ననుచు దాసి
యానెలంత మెడకు నడ్డంబుగా మెడ
యొగ్గె వృద్ధసతి యనూనకృపను. 128

వ. ఇవ్విధంబునం గలభాషిణికంఠంబునకుఁ దనకంఠంబు నడ్డంబు సేర్చి వ్రేటు కనుపీక దాని నిరుఁగేలం బొదుగఁ బట్టుకొని పరమకరుణాపరవశత్వంబునఁ దొలంగక యావృద్ధభామిని "యోయిసిద్ధుండ! నీకుం గార్యసిద్ధి గాదుసుమీ! యిద్దేవిమీఁది యాన నతిక్రమించిన!" ననుచు "నోమహాశక్తి! నన్ను సత్య వచనం గావింపుమీ!" యనుచు నుండ నతం డఖండరోషం బున మున్ను దాని మెడ ఖండితంబు సేసి విచిత్ర వేగంబునఁ గలభాషిణికొప్పువట్టి పట్టెంబు జళిపించి వ్రేయ నెత్తుటయు, నెత్తినచేయి తత్క్షణంబ యందుకొని మృగేంద్రవాహన నిజ శపథసముల్లంఘనోత్సాహసాహసదోషదూషితుం డగునతని నతిదూరంబునం బడవైచె. సుముఖాసత్తియు నట్లు సంప్రాప్తం బైనయసివిఘాతంబునం దనజరద్దేహంబు వడినట్టితక్షణంబునంద.
సీ. నిండుచందురు నవ్వునెమ్మోముసిరితోడ
నిరులు గ్రమ్మెడు వేణిభరముతోడ

1. దీన.

నాకన్నలోలంబు లగునేత్రములతోడఁ
దళుకొత్తుచెక్కుటద్దములతోడ
మిగుల మింటారించుబిగిచనుంగవతోడ
లలితంపుబాహువల్లరులతోడ
సతికృశత్వమున జవ్వాడుమధ్యముతోడ
నభినవం బైసనూఁగారుతోడ

తే. వలునమీఁదికిఁ దొలఁకుసువర్ణపులిన
గురునితంబప్రభాపరంపరలతోడ
మహితసర్వాంగలావణ్యమహిమతోడ
సమరుప్రాయంపురూపు చిత్రముగఁ దాల్చె. 130

తే. తాల్చి యావికచోత్పలదళనిభాక్షి
కనుఁగొనియె నభ్రమున శక్తికరవినున్న
గాత్రు సిద్ధుని నొకకేలఁ గత్తి యొక్క
కేలఁ గలభాషిణిని విడకే చనంగ. 131

క. ఆకరణిఁ జూచినది యై
యాకలభాషిణియవస్థ కాత్మఁ గలఁగుచుకా
వ్యాకులత నొందెఁ దనదు చి
రాకాంక్షితసిద్ధి పెంపు సనయనిమదితోస్. 132

సీ. అంతఁ గ్రమంబున నాసరోజాక్షి సం
సారస్వభావవిచారమహిమ
వలనఁ దద్భోగఋఖంబు వారించికొని దానఁ
దాను భోగ్యార్థచింతనము వదలి
చేవిసత్కృపఁ బ్రసాదించినయట్టిజ
వ్వనపుసత్వము వృథా చనకయుండ

యోగవిద్యాభ్యసనోపయోగంబునఁ
గడపెదఁ గాకంచు విడువకెపుడు
తే. యమనియమవర్తనములతో నాసనాదు
లభ్యసింపఁగఁ దొడఁగె నత్యాదరమునఁ
దాను మును విన్నభంగులు దాఁపు గాఁగ
నచటిశక్తిని గురువుగా నాత్మ నునిచి. 133

వ. అంతటం గలభాషిణి యచ్చటి కేగుదెంచి యాచంచలాక్షి నీక్షించి "నీవెందుండివచ్చి? తెట్టిదాన?" వని యడుగుటయు, నప్పడంతి "యేను మును నీకు నడ్డపడి సిద్ధునిచేత ఖండితనైనసుముఖాసక్తి యనువృద్ధవనితం జుమ్ము; క్రమ్మఱ నిమ్మహాశక్తికారుణ్యశక్తివలన నిట్టియెలప్రాయంపుసొంపు వడసియున్నదాన." నని తత్ప్రకారం బెఱింగించి "యోకలభాషిణి! యట్లు సిద్ధునితోడ నిమ్మహాశక్తిచేత దూరవిత్తివ్రతనై యెచటంబడి తేమియు నొవ్వక యిట్లు తిరిగి వచ్చుట యద్భుతం బగుచున్నది" యనుటయుం గలభాషిణి "యోయమ్మ! ధర్మగుణంబున నిమ్మహాదేవిని మెప్పించి యిప్పగిది నీవు తిరుగం [1]బ్రాయంబు గనుట యద్భుతంబు గాక; యింతటిమహాపుణ్యనిధివై నసీదుకారుణ్యంబు గలుగ నేఁ దిరిగివచ్చుట యేమియద్భుతంబు? నావిధం బంతయు విన్నవించెద" నని పలుకుచుండ. 134

క. బంధురవీణాసహిత
స్కంధముతో రత్నమాలికాఘటితజటా

1. బ్రాణంబు.

బంధముతో నంతట మణి
కంధరుఁ డచ్చటికి వచ్చె గంభీరగతిన్. 135

క. వచ్చినఁ గని యతిమోదము
నచ్చెరువుఁ బలర్ప మ్రొక్కె నతని; కపుడుఁ దా
నచ్చెలువఁ జూచి మోదము
నచ్చెరువుఁ బలర్ప వికసితాస్యుఁ డగుచున్. 136

క. "ఓహోహో! మాబంధు
వ్యూహం బంతయును వచ్చియున్నట్లయ్యెన్
నాహృదయమునకుఁ బరమ
స్నేహనిధీ నిన్నుఁ గనుట నేఁడు లతాంగీ. 137

మత్తకోకిల. వచ్చెకంటి మముం దలంతువె మానసంబున? సుందరీ
వచ్చు టెట్లు? కదన్ విచిత్రము ద్వారకాపురి నాఁడు నీ
కిచ్చ పుట్టుట? యెన్నఁడున్ మఱి యిట్లు తేఁగి రయంబుగ నీ
వచ్చెలుల్ మణిగేహముల్ సిరు లట్ల యున్న విధంబె కదా! 138

సీ. ఉత్తమశ్లోకుఁ బయోజాక్షు సేవింప
నేగితే యీపెన్కు నెన్నఁ డైన?
నాజగత్పతి తొంటియలవజ్రమణిసభ
కేతెంచి కొలువు సేయించుకొనునె?
తనసేవఁ గాఁ బురందరుఁడు గట్టించు కెం
పులహజారము కడముట్టె నొక్కొ?
మనవీణియ లడంచుకొని భ్రమియించు నీ
లపుటరుంగులకుఁ బో నిపుడుఁ గొలఁదె?

తే. యంతకంతకు వర్ధిల్లుహారికుమాళ్ల
బలఁగమున కిది చాల దన్తలఁపుతోడఁ

పెనఁగఁ గట్టించె మును పైఁడి[1]గరిడిసాల
యట్లు యున్నదియే వికచాబ్జవదన? 139

మ. పిగుసుంబోఁడి యెఱుంగుదే 'యదుపతి స్త్రీ లెవ్వరే నిందులే
డ గదా!' యంచును శంకఁ గ్రమ్మఱిలిఁ జారుద్యూత
గేహంబు క్రొత్తగ నీవొక్కటి చూపఁ దోడ్కొని చనం
డచ్చోక చౌవంచ యిత్తిగ బారా దుగ యంచుఁ జిల్క
రొప్పి లుద్దీపింప దా దవ్వులన్? 140

చ. కుటిలకచా! యెఱుంగుదువె గొబ్బున నేఁ జని కొల్వుకూట
మొక్కటి కడ నున్కి యాపయక కట్టెమటుం బటికంపుగోడఁ
బ్రస్ఫుట[2]ముగ డానియందు హరిఁజూచుచు మ్రొక్కఁగను
గొన్కనుండి [3]"యిట్టిటు మొగ?" యంచు నవ్వె సభ యెల్ల
పస్మణిభిత్తి యున్నదే?" 141

క. అని యడిగిన "నన్నియు శో
భనవస్తునఁ బొంటియట్లు భాసిల్లెడు నో
యనఘ! సురరాజుసేవయు
ననుపనుముగఁ బూన్న మయ్యె" నని యది పలికెన్. 142

వ. అని పలికిన నతండు. 143

సీ. "సంగీతవిద్యాప్రసంగంబునం దైన
మముఁ దలంతువో లేదో మనసునందు?
తనుజారి కే నొనర్చినదండకంబు నీ
వెందైన మఱి వెలయించి తొక్కొ?
యిప్పుడు నారదుం డప్పటప్పటికి వ
చ్చునో రాఁడో వసుదేవసూనుఁ గొలువ?

1. గరడి. 2. మగుడాని నందు. 3. యట్టెటు.

నాలోకవిభుసతుల్ మే లేర్చి యిచ్చిన
వీణె యే మఱియ్యేఁ జే విచ్చుటికిని?

తే. నేమి యేమియొ నాఁడు నీహృదయమునను
గోర్కి యొక్కటి గలుగుట కొంత్త వింటి
నది ప్రవృద్ధంబుగాఁ బెంచి యాత్మలోన
విడిచిపెట్టితో వీణపై వేడ్క నెల్ల." 144

చ. అనుటయు లజ్జ సజ్జలసహాసస యించుక యించుక యోర
గాఁగ వంచినమొగ మొప్ప "నే మనుచుఁ జెప్పఁగ! దానన
చేసి కాదె యో, యనఘచరిత్ర! నాకుఁ గలయట్టి
బలంగము లెల్లఁ బాసి యీఘనగహనప్రదేశములఁ గష్టపుఁ
బాటులఁ గుందితిం గడున్." 145

వ. అని పలికి తనగానవిద్యాభ్యాసపరిసమాప్తి గ్రామనస్మృటఁ బస
యున్నచోటికి మణిస్తంభుండు వచ్చినప్రకారం బెఱిఁగించి
యతండు దూరదృష్టి దూరశ్రవణశక్తిబలంబునఁ జనను
జెప్పిన యర్థము సకలంబునుం జెప్పి తన్ను నతండు మృగేంద్ర
వాహనాభవనంబునకుం దెచ్చిన తెఱంగును బలిపశూకరణో
ద్యమప్రకారంబును సుముఖాసత్తి తన్ను రక్షించుటయును
వివరించి "యీపుణ్యసాధ్వి యీయమ" యని యీయక్కం
జూపి తత్తత్స్థానవర్తనంబులు దెలిపి "యోగంధర్వో
త్తమ! యింక నాకు నీచందంబు వినవలయు నవ్విధంబున
రంభచేత నీతపంబు విఘ్నంబు నొందుట యామణిస్తంభునిచేత
నేను విన్నప్రకారంబు వింటివి కదా! యటమీఁద భవ
దీయవర్తనం బెఱింగింపు" మనునంతట మణిస్తంభుండు వచ్చు
టయు "నిప్పుఁడే జెప్పినసిద్ధుం డితం" డని చూపిన

"నీతండా!" యని దరహాసితవికసితాననుం డగుచు మణికంధ
రుం డతనిం దగు తెలుంగునసంభావించె; నతండును. 146

క. ఇచ్చోఁ దదాగమనమునకు
నచ్చెరువు జనింప "నిది మహాశ్చర్యము ! మీ
రెచ్చోటనుండి యిచటికి
విచ్చేసితి?" రని వినీతవృత్తిం బలికెన్. 147

సీ. పలికి యంతటఁ గలభాషిణిఁ జూచి "యో
యింతి నీ వెదకితి నెల్లచోట్ల
నెందుఁ గానక చోద్య మందితి నప్పు డె
క్కడ నుండి తిప్పు డిక్కడికి వచ్చి
తని పల్కుచును సుముఖాసత్తిఁ జూచియె
చ్చటనుండి వచ్చి తిచ్చటికి నీవు?
పే రెద్ది? యని తత్ప్రకారంబు దానిచే
తన విని వెఱఁ గంది వినుతి చేసె

తే. నాసతి యతనిఁ గనుఁగొని యరుదుపడుచు
నిట్లనియె "నోయిసిద్ధుండ యెచటఁ బడితి
[1]రీవుఁ గలభాషిణియును నిద్దేవిచేత
నట్లు సరభస విక్షిప్తు లగుచుఁ బోయి? 148

వ. మీర లేమియు నొవ్వక తిరిగి వచ్చుటయు నచ్చెరు వై
యున్నయది. నాకు నింతయు వినిపింపవలయు" ననిన విని
మణిస్తంభుం "డోయంబుజముఖి! నీకు నట్లవినిపించెద విను
మఱియ కాదు మఱియు నెన్నియేని విచిత్రంబులు గని వచ్చి
నాఁడ; నది యొక్కరితోడం జెప్పెడుసందాఁక హృదయంబు

1. నీవు.

వేగిపడుచున్నది గావున, నన్నిటం బూజ్యురాల వైన నీకు
వినిపించెద" నని యిట్లనియె. 149

ఉ. "ఆవిధి నీపయిం బెగి మదాతిశయంబునఁ గన్నుఁ గానమిన్
దేవతమీఁది యానయు గణింపక యాకలభాషిణీన్ శిరో
జావళి పట్టి త్రుంచుటకు నాయుధ మెత్తితి నెత్తినట్టికేల్
చేవి వహించి వైవఁ జనితిం గడు దవ్వుగ నివ్వధూటితోన్."

మ. అనుడున్ "నీవిది చెప్పఁగా వలన దే నాముున్న యీరూపుఁ గై
కొని వీక్షించితి నన్ను నీచిగురుటాకుంబోఁడి మూర్ధంబు ప
ట్టిన కేల్ పట్టినయట్ల యుండ ధృఢముష్టిం బూని బట్టెత్తి గొ
త్తినకే లెత్తినయట్ల యుండ దివి నుద్వేగంబునం బోవుచోన్.

క. వినిపింపు నాకు నట మీఁ"
దన నతఁ డిట్లనుచుఁ జెప్పె "నిట్లురునది [2]సం
చనమున వైచినగతి నభ
మునఁ జని మణికంధరుని తపోవనభూమిన్. 152

క. ఇత్తరుణియు నేను నొక
మెత్తనిక్రొత్తలిరుఁ బాన్పుమీఁదఁ బడితి మో
మత్తేభగమన యట్లే
సత్తియుఁ గృపసేయఁ బోలుఁ జావక యుండన్. 153

క. మునుపటిభయమున నప్పుడి
యునికి నపుడు చేతికత్తియును సుసరుశరం
బును విడువఁగ నెఱుఁగనినను
గనుఁగొని నెమ్మేను మిగుల గడగడవడఁకన్. 154

2. దంచనమున.

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ
బాఱు ముఖేందుబింబంబుతోడ
జాలఁగన్నద్వయీకూలంకషంబు లై
తల్లడం బందు నేత్రములతోడఁ
గడుఁ జెమర్చినయట్టికలికిలేఁజెక్కుల
నంటెడువిగళత్కచాళితోడ
వలిగుబ్బపాలిండ్ల నిలువ కిట్టట్టు సం
క్షోభించుపయ్యెదకొంగుతోడ
తే. వెఱవు నొకయొజ్జ యై వింతవిలసనములు
గఱపఁ జూపట్టుసౌందర్యగరిమతోడ
సరభసాక్ష్ణక్షోభచకిత యైన
మదనుజయలక్ష్మిలీల నిమ్మగువ దనర. 155

క. కనుఁగొంటిం గనుఁగొనునం
తన మన్మథవశుఁడ నగుచుఁ దగఁ బరిరంభం
బును గావించితి నేఁ జే
సిన పాపముఁ జెప్పవలయు శీతాంశుముఖి! 156

మ. అది సైరింపక [1]బాలఁ బేరెలుఁగుతో నాక్రోశముం జేసె "న
న్నిదె యీపాతకి బల్మిఁ బట్టెడుఁ గృపన్ వీక్షింపరే కావరే
[2]సదయత్వంబున నో హా సత్పురుషు లిచ్చో నెవ్వరున్ లేరె యా
పద వారింప శరణ్యులార" యని యాపద్మాక్షి యత్యంతమున్.

వ. అప్పుడు: 158

క. నెఱయఁగ నసహ్యమగున
మ్మొఱ వీనులఁ బడిన మిన్నుముట్టు నెలుఁగుతో

1. చాల. 2. సు(యతితప్పినది.)

"వెఱవకు వెఱవకు మే నిదె
పఱతెంచితి సత్వరముగ భామిని" యనుచున్. 159

క. "వెఱవక యెవ్వఁడురా వెత
పఱచెదు నిట్లతివ! నెందుఁ బాఱెదఁ గూడం
దఱిమెదఁ దల నరములతోఁ
బెఱికెద" ననుచున్ నితాంతభీషణగతితోన్. 160

చ. ఒకపొదరిల్లు వెల్వడి రయోద్ధతుఁడై సలకూబరుండు రాఁ
బ్రకటముగాఁ గనుంగొని యభంగురభీతిఁ గలంగి దీని నే
వికలమనోధృతిన్ విడిచి వేగమ యవ్వలఁ బాఱిపోయితిం
బ్రకుపితుఁడై యతండు ననుఁ బాయక వెన్కొని పట్టెను గ్రతన్.

వ. అట్లు కూడముట్టి పట్టుకొని: 162

శా. "ఓరీ యెవ్వఁడ వీవు? పాతకముతో సన్న్యాసివై యిప్పు డే
నారిం బట్టితి వెట్టుగా మొఱ యిడన్? నా పంపు సేయం డగం
బా? రా రమ్మటు దానిఁ జూపుదు ప్రాయశ్చిత్త మామీఁద నీ
కేరీతిం దగు నట్లొనర్తు" నని తా నెంతే సమక్షంబునన్. 163

వ. కొంతమేర నన్నుం గ్రమ్మఱం దెచ్చునంత. 164

సీ. తిరముగా ముడ్డువమి విరియఁ బాఱెడుకొప్పు
దోడ్తోడ నొకకేలఁ దుఱిమికొనుచు
వల్లెవాటుగఁ గొంతవలువ చక్కన నిల్పి
పెఱచేత నీవి గల్పించుకొనుచు
నుదుటిపై నొక్కింత చెదరినముంగురుల్
పాపటకును బొందుపఱచుకొనుచు
సారెకు జాఱెడు శ్రవణకహ్లారంబు
లంపంద మూఁపున నానుకొనుచుఁ

తే. జెమట నంటినపానుపుచివురుఁదూనుక
లెడనెడ నఖక్షతాశంకఁ బడవుకొనుచు
రంభ యేతెంచె మిగుల సంరంభ మమరఁ
దొలుతఁ బ్రియుఁ జేగుదెంచిన త్రోవపట్టి. 165

శా. ఈలీలం జనుదెంచి "యక్కటకటా యేమంచు నీ దూలుదుం
గేలం గైదువు గీదు వేమియును లేకే యిట్మెయిన్ వత్తురే
[1]చాలున్ దూరము గాఁగ? నేనిదె పరిశ్రాంతింగడున్ నొచ్చితిం
జాలుం జాలుఁ గరంబు మెచ్చఁ దగు నీచందంబు ప్రాణేశ్వరా!"

వ. అని తనదు ప్రియుం బలికి నన్నుం గనుంగొంచు నతనితోడ. 167

క. "వీఁడా యట్లనాయ్యయపుఁ
బోఁడుములకుఁ బూనినట్టిపుణ్యుఁడు? పూవి
ల్కాఁడో వల్లభ యెంతటి
వాఁడైన నగున్ విశంకవర్తనుఁ డౌడున్. 168

క. ఆయింతి యెందుఁ బోయెనొ
కో?" యనుటయు "దానిఁ జూపుకొఱకునె కాదే
యీయయ్యఁ బట్టి తెచ్చుట
యోయంగన యిప్పు" డనుటయును గృపవొడమన్. 169

వ. "ఆయింతిం జూపక యితం డింక నీముంచట నెందుఁ బోయెడుఁ
జెయి వదలు" మనుచుఁ బ్రార్థించి. 170

తే. విభునిచే విడిపించె నవ్వేఁది నన్ను
నేను వారలఁ దోడ్కొని యీనెలంత
యున్నచో టారయుచు ముసు పున్నతలిరుఁ
బొన్పుఁ జూపితిఁ గాన [2]నిప్పుడఁతి నచట. 171

1. చాలన్. 2 మిప్పుడఁతి.

భాగమునఁ దనకోమలపాణిఁ జేర్చి
యనుపదంబును రోమాంచితాంగి యగుచు. 176

ఉ. ఏసును వారివెంబడిన యేగితిఁ బాయకయింత నంత "నెం
చేని మనోభవక్రియల నింపుసు నేమఱి పెట్టిపోవునో, యానల
కూబరుండు మదుదగ్రకృపాణము" నంచు దాని నన్యూన
గురుప్రసాదమహిమోన్నతిఁ గాంచుటఁ బాయఁజాలమిన్.

చ. అదియును గాక యావిపిన మంతయు నెంతయు సావధానతన్
బదిలము గాఁగ నప్పుడతిఁ బాయక యప్పుడు దూరదృష్టిచే
వెదకి కనంగ లేక కడు విస్మయ మందుచు "నేమి మాయరో!
యిది యని, వీరి కైన నొకయీగడ వెళ్లునా?" యంచు
నేగితిన్. 178

క. అంతట నాయిరువురు న
త్యంతము నంగాంగసక్తి నాత్మలు గరఁగన్
గంతుక్రీడలు గైకొని
రెంతయు నెడ గలుగ నేగి యేను నిలిచితిన్. 179

శా. ఆలీలన్ రతికేళిఁ దేలి తుదయం దాయిద్దఱుం గేలిభి
న్నాలంకారము లొక్కరొక్కరికి నింపొనట్లుగా దిద్దుచున్
లోలత్వంబున నుండ నచ్చటికి నాలోఁదత్పదశ్రేణిచూ [న్.
ప్పాలోకించుచు రంభ వేతొకతె డాయన్ వచ్చెఁ జిత్రంబుగ

ఆ. వచ్చి ఙెచ్చువడియె నచ్చెరు వందుచు;
నచ్చకోరనయన వచ్చు టరసి
యద్భుతంబు నొందె యక్షేశసుతుఁడు; స
వ్విధముఁ జూచి యేను వెఱఁగుపడితి. 181

ఉ. అంతట యక్షరాజసుతుఁ డాకరణిం జనుదెంచి యున్న యా
కాంతప్రకారముం దనదుకాంతప్రకారముఁ గాంచి ప్రొద్దు వి
శ్రాంత మహావధానమునఁ గ్రమ్మఱి క్రమ్మఱి నాడునాఁడు నందు
[1]నొ, క్కింతవిభేద మేర్పడమి నెంతయు సత్స్మృత మావ
హిల్లఁగన్. 182

క. ఈమాడ్కిఁ జూడ "నను న
న్నామినిఁ గడుఁ దిరిగి తిరిగి కనుఁగొనియెదు నీ
వేమి యిది? నాకుఁ జెప్పుమా
నీమది?" యని యతని నతనిచెలఁతుక పలికెన్. 183

వ. ఇట్లు పలికిన నతండు. 184

తే. "నీదు ప్రతిబింబ మనియొ దాని ప్రతిబింబ
మీవొ యేమని చెప్పంగ నిగురుఁబోఁడి!
నేర్పుఱుపరాక యున్నవా రీవు నదియు
దీని కరుదంది చూచెదఁ దిరిగితిరిగి. 185

క. తుద నేమి చెప్ప! నాపం
డ వోలంగిన దాని నినుఁ దడంబడకుండన్
మదిలోన నేర్పరించుట
సుదుర్లభ!" మ టన్న నతని సుదతి గలఁగుచున్. 186

సీ. "అక్కటాఁ ప్రాణనాయక నినుఁ గౌఁగిటఁ
బాయనే వెఱతు నీ మాయలాఁడి
యీరూపుతో మన కెడ సేయ నేతెంచి
నదియొ! తొల్లియు నొక్క యసురజంత

1. నొక్కింతయుంభేద.

జనకనందనకు రామునకును నెడ సేయఁ
గడఁగి వచ్చుట వినఁబడుచు నుండుఁ
గావున దీని నిక్కడఁ జుట్టుపట్టున
నుండంగ నిచ్చిన నొప్పకుండు

తే. వట్టి మొగమోట సాలించి గట్టిగాఁగ
నదర [1]వైచుచుఁ జనుమంచు నౌర నీవు
కదలెడు సు!" మంచు సంభ్రమం బొదవ నపుడు
కాంతుకంఠంబు నొకకేలఁ గౌఁగిలించె. 187

క. క్రొత్తగ వచ్చినరంభయు
నత్తెఱఁ గంతయును గని కరాంగుళి నాసన్
హత్తించి తలఁ గదల్చుచు
నుత్తలపా టేర్పడంగ నుస్సురు మనియెన్. 188

ఉ. అక్కమలాక్షిఁ జూచి యలకాధిపనందనుఁ "డోపడంతి! నీ
వెక్కడనుండి వచ్చి? తివి యేటికి నుస్సురు మంటి? నీకు నీ
యక్కజ మేల వచ్చెను? [2]మదంగనరూపముఁ దాల్చి తేగతిన్?
రక్కసివో పిశాచివో కనం బిది చిత్ర! మెఱుంగఁ జెప్పుమా."

క. అన నయ్యంగన "నా కే
మన నోరున్నయది ? మీర లనినంతయుఁ జె
ల్లున మీ కౌఁగాములు చె
ల్ప నుపాయం బొకటి గానఁ బడునందాఁకన్. 190

ఉ. రక్కసి వన్నెఁ గా ననఁగ రాదు పిశాచియు నౌదు నాదురూ
పెక్కడఁ దాల్ప నేరిచియొ యిమ్మెయి నెంతయు హత్తుకొన్న

1. వైచి పొమ్మను మంచు. 2. సురాంగన.

యీ, చక్కనిముద్దరాలు తనసత్యము లోక మెఱుంగ నింకఁ
దా,రక్కసియో పిశాచియొ యిరంబుగ నేర్పడి పోవునంతకున్.

క. విను మాయేర్పాటు దనం
తన యగుచున్నయది యెట్లొఁ దప్పదు సత్యం
బనఁగా దైవం బనఁగా
జనులకు లేకున్న నెట్లు జగములు [1]నడుచున్. 192

క. దైవం బనఁగా నా కిఁక
నోవల్లభ వేఱ యొక్కఁ డున్నాఁడే? యా
దైవమవు నీవ చేయం
గావలసిన నీవ చేయఁగల వేర్పాటున్. 193

సీ. అల్లప్పు డొకచోటఁ జల్లనిసురపొన్న
నీడ మెచ్చుచును నాతోడఁ గూడి
యందుఁ బల్లవశయ్యఁ గందర్పకేళి సం
పాదించుచోఁ బడమటియందు నొక్క
వనితయాక్రందనధ్వని వినఁబడుటయు
నీవు డిగ్గన లేచి పోవుచుండ
నేను నీతోడన యేతెంచుచో నొక
యిఱ్ఱి డాపలినుండి నేగుటయును
తే. జూచి నిలిచితి నేను నిల్చుటఁ గనుఁగొని
యెచట నెల్లిది మాత్రనో యెఱుకపడదు
వేగిరించక నీవ భావించుకొనుము
కల్లనిజములు క్రమముగాఁ గానవచ్చు." 194

1. నడచున్.

చ.అనుడుఁ గుబేరసూను మొగమారసి తత్ప్రియ యొక్క కేలనా
తని మెడఁ గౌఁగిలించియ యుదంచితహాసముతోడ నిట్లనున్
"మనచరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పులసాని చెప్పిన
ట్లె నిజము గాఁగ నివ్వెరవిలాసిని యెచ్చటనుండి చూచెనో?

తే. అచట నపు డట్లు నిన్నుఁ గూడి యలరినవియు
నట్లు నీ వేగుచో వచ్చినదియుఁ దాన
యగుచుఁ దోఁప సం దదికి యె ట్లాడ నేర్చె!
మగువ గాదుర యిది పెనుడగర గాని. 196

ఉ. ఇప్పగిదిన్ మదాకృతి వహించి నినున్ ననుఁ బాయఁ జేయనే
చొప్పునసై నఁదాఁగలయఁజూచు దురాశలమాయలాఁడి వా
తప్పక [1]యింకఁ ద త్తదుచితంపుఁగుయుక్తులమాట లెన్ని యే
[2]నొప్పఁగ నాడుకో నెఱుఁగ కుండునె? యిట్టివి చెప్ప నేటికిన్?

క. విను వల్లభ 'క న్నుండం
గనుపాపం డవియ నేర్పు గలమునిము' చ్చీ
వనిత; శగ డిచట నుండన్
వెనుకను దిద్దుకొన వచ్చు నే యొకతైనన్?" 198

వ. అని యచ్చటఁ ఎన్ను నిలువనీక పోఁదోలుటకు నిజవల్లభుని సత్వరంబుగా బోధించునాచంచలాక్షిపలుకులకు నలుకబలియ మనంబున సైరింప లేక యాకంబుకంఠి దాని నధిక్షేపించుచు ని ట్లనియె. 199

క. "త్రుళ్ళఁగ నేటికి? నిలునిలు;
మిల్లలికినఁ బం... నగునె? యింతటిలోనే

1. యింత త. 2. నొప్పగ.

వల్లభునకుఁ గడు నచ్చిన
యిల్లాలవె? యేను లాఁతినే పోఁదోఁలన్? 200

క. మగఁ డాపట్టంబునఁ దలఁ
దెగఁ గొట్టినఁ గొట్టుఁ గాక తెకతేఁలఁగ నీ
కెగవిడిచి పోయెదనె ప్రా
వగ నాకాణాచిర్యైనవలపులపంటన్! 201

క. ఈరీతిని మద్వల్లభుఁ
గోరిక మెడఁ గౌఁగిలించుకొని నీ వుండన్
సైరించుట కొఱ గా దిది;
రార మ్మిఁక నోర్వఁజుమ్ము రావె" [1]యనుచున్. 202

క. నెడ దెరువు లిచటఁ జెల్లవు;
"పుడమి నహహా! దొంగ లాస వొడిచినఁ గోకల్
విడుతు రె?" గణింతునే యొ
క్కడిగతిమాలినపిశాచికవా నీమాటల్." 203

వ. అనుటయు నాయింతి సైరింపక. 204

మానినీవృత్తము. అంత మదింపకువే యని పల్కిన
నంత మదింపకువే యనుచున్
గంతు లడంచెద లెమ్మని పల్కినఁ
గంతు లడంచెద లెమ్మనుచున్
రంతుల నేమిఫలం బని పల్కిన
రంతుల నేమిఫలం? బనుచున్
బంతము చూడఁగ దే! యని పల్కినఁ
బంతము చూడఁగ దే! యనుచున్. 205

1. యనుచుఁన్.

సీ. ఒట్టు సుమీ! యన్న నొట్టుసుమీ! యంచు
నేమేమి? యనిన నేమేమి? యనుచుఁ
గానీగదే! యన్నఁ గానీ గదే! యంచు
నిం కేల? యనిన నిం కేల? యనుచు
నోసి పోవే యన్న నోసి పోవే యంచు
నౌ నంటి వనిన నౌ నంటి వనుచు
మఱవకు మిది యన్న మఱవకు మిది యంచు
నీవెంత? యనిన నీ వెంత? యనుచు
తే. నొకతె మగనికి నాసించు టొప్ప దనిన
నొకతె మగనికి నాసించు టొప్ప దనుచుఁ
బట్టి యాడె నారంభతోఁ బ్రథమరంభ
ప్రియుఁడు నిలు మన్న నిలువక పెద్దరొదగ. 206

వ. అంత. 207

చ. జగడపుఁగూటిసత్తరువు సారెకుఁ గోరుచు వీరి వారినిన్
బగిలెడుతంచనాలజడదారి పొరింబొరిఁ గుంచె వీచుచున్
మిగులఁగ వీణెమీటుచును నేఁడుపడంతుల[1]యొద్దనుంగడున్
నెగడెడువిందు గల్గెనని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్.

క. వచ్చినఁ గుబేరసూనుఁడు
నచ్చెలువలు నెదురుగాఁగ నరిగి యతనికిన్
నిచ్చల మగు తాత్పర్యం
బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లన నగుచున్. 209

క. "నలకూబర నీ కిం దే
చెలువ ప్రియవధూటి నాకుఁ జెపుమా? దానిన్

---

1. వద్దెనన్.

తెలియక దీవింపఁగ రా
దలరుఁ డొకరొకళ్ల ప్రేమ" ననుచుఁ దమ్మున్. 210

మ. "తనకంటెం బ్రియ నీకు లేదు తనసౌందర్యంబె సౌందర్య"మం
చును గర్వించుచు నున్న రంభమదముం జూడంగ లేకిట్టి పా
నిని నీవే సృజియించితో? యదియ తానీతోడఁ గ్రీడింపఁగాఁ
దనమేనొక్కటిచాలదంచుఁగడఁకన్ ద్వైరూప్యముం బొల్చె

తే. ఎట్లయిన నీదుప్రేమ యీయిరువురందు [నో?
సమ మగునొ కాదొ చెప్పుమా చాలఁ దడవు
వీరిఁ బోరించి? తవ్వేడ్క విరియఁ జిహ్మ
లేక కనుఁగొంచు నుంటి నే నాకసమున." 212

క. అనుటయు "నే నెక్కడ వీ
రిని బోరించితి నయో విరించితనయ! నా
కును వీరలసమరూపత
యును బోరును వెఱఁ గొనర్చుచున్నది మిగులన్." 213

వ. అని పలికి మున్ను దా నందు నొక్క రంభఁ గూడి క్రీడించు [1]చుండి యప్పుడనతిదూరంబున వనితాకృతం బైనయాక్రంద నంబు వినంబడినఁ గారుణ్యసంభ్రమంబున నద్దిక్కునకై చను టయు, నంతం దనదృష్టిపథంబునం బలాయమానుండనగు నన్నుం దఱిమి పట్టుకొని యొకకొంతదవ్వు దిరుగఁ గొం పోవుటయు నచ్చటికిఁ దనకాంత గూడ వచ్చుటయుఁ దత్ప్రార్థనంబున నన్ను విడిచి యిచ్ఛావిహారంబుల నదియుం దానుఁ గొంతప్రొద్దుపుచ్చుటయు నంత రెండవరంభ వచ్చు టయు దానివచనప్రకారంబును గలహాభంగులుం జెప్పి యానలకూబరుం డాయిద్దఱు రంభలయందు. 214

1. చున్నయెడకనలి.

సీ. తా నటమున్న క్రొ త్తగఁ దీర్చినట్టిక
స్తూరికా తిలకంబుసొంపుతోడఁ
గన్నె గేదఁగి ఱేకు లన్నువగాఁ గొనల్
గాన్పింప నిడినకీల్గంటుతోడ
బంగారుపస మించుపసనిపుప్పొడి రేఖఁ
జూపట్టుపాపటసొబగుతోడ
సరివాటు గాఁగఁ గేసరములు గ్రుచ్చిన
కురువింపవిరిగుబ్బసరముతోడ

తే. నొప్పు మీఱుచు నున్నట్టియొకతెఁ జూపి
"యీ సరోజాయతాక్షియు నేను నున్న
చోటి కింతకము న్నావధూటి వచ్చె"
ననుచు రెండవయింతి నమ్మునికిఁ జూపె. 215

ఉ. చూపిన నాలతాంగి యజసూనున కంజలి చేసి 'యోమహా
తాపస! యల్లనాఁడు మము ద్వారకచేర్పిన నాడినట్టి మీ
యాపలు కింత చేసె' నన నన్యయు నట్లయనన్ మునీశ్వరుం
డాపుఁబోండ్ల నిద్దఱ'యథార్థమ పల్కితి'రంచు నవ్వుచున్.

క. "ఆమాటలు సరిదాఁకెఁ గ
దా! మా కీవీక్షణోత్సవాతిశయంబున్
బ్రేమమునఁ జూడఁగల్గెను
వామేక్షణలార! పోయి వచ్చెద నింకన్." 217

క. అనుటయు నలకూబరుఁ "డో
మునివర! యిద్దఱ యథార్థముగఁ బల్కితి రం
చును బల్కితి రెట్లొకొ యిది
వినవలయుం దేటపఱచి విచ్చేయుఁ" డనన్. 218

సీ. నాఁడు తా నాత్మ సౌందర్యవై భవపతి
వాల్లభ్యమహిమగర్వమున నాఁడు
కొనువాక్యములు నేను వినలేక సవతి యే
గతిఁ గల్గునో మీఁదు గంటివె యని
నట్టిమాటఁ దలంచి యాపలు కింతనే
సె నటంచుఁ దార్కాణనేసె నొకతె;
యొకతె రంభారూపయుక్తిచేఁ బ్రియుఁగూడఁ
గాంక్షించి యొకకార్యఘటనవేళ

తే. నాదియందును నాచేత నదివరముగఁ
దనకు నిచ్చితి ననిపించుకొనుట యిపుడు
హృదయమున నిల్పి యాపలు కింత నేసె;
ననుచుఁ దార్కాణ నేసె రెండును నిజంబు. 219

క. నా విని యిపు డీభావం
బీవనితకు నీవనితకు నిది యనుచు బయల్
గావించి తథ్యమిథ్యా
భావంబులు మీర లేరుపఱుపఁగవలయున్. 220

క. నావుడును "తథ్యమిథ్యా
భావంబుల కేమి? నీకు భావింపఁగ స్వా
భావికమే యీయాకృతి
భావము? నిజ మెద్ది యీప్రపంచమునందున్. 221

క. నీ ప ట్టురువడ నొక్కతెఁ
జూపి యొకతె గర్వ మడఁచుచుణ వలయుఁగతిన్
బ్రాపింపవచ్చు భోగము
నీపుణ్యం బినుమడించి నేఁడు ఫలించెన్." 222

ఉత్సాహ.—

అనుడు నోమహాత్మ పెద్దలైనవారిఁ దడవ్రుగా
ననిచి యిట్టు నట్టు పలుక నొప్పు కేమి వచ్చునో?
చనుఁడు నిలుప వెఱతు ననినఁ జనియె నాతఁ డట్ల యా
ననుచు నుచితలీల నుండు మనుచు నల్ల నవ్వుచున్. 223

సీ. ఆర్థిశనందనుఁ డంతట నెప్పటి
తనపువ్వుఁబోఁడి కై దండఁ గొనుచు
'నిది యెంత లేదు నెమ్మది నిట్టివిఘ్నముల్
గుఱిచేసి మనకేలి మఱవనేల?
రమ్మంచు రెండవకంభఁ గనుంగొని
'నీ వెంతనేర్పులు నెఱపితేని
మాయలే యని తోఁచు మాకుఁ గావున నీదు
సత్య మెఱింగింపఁ జాలినట్టి

తే. సాక్షిఁ దెమ్ము పొమ్మని తిరస్కారసరణి
దోఁపఁ బలికెఁ దాత్కాలిక దుర్నివార
మారకేళీకుతూహలమహిమచేత
నెచటి కేనియు నపుడు తా రేగఁ దలఁచి. 224

ఉ. ఆసువతిం గనుంగొని తదంగన యప్పుడు హెచ్చినట్టి వే
రీసున నీసడించుచు "నోకించుక నీకును సిగ్గు లేదొకో!
దోసము గాదె యిద్దఱు వధూవరు లేకత మున్నచోటికిం
డాసిన? నిట్టియాసలఁ గడంగిన నే మని చెప్పు! నావుడున్. 225

వ. ఆరంభ యమ్మాటలకుఁ గడునలిగి రోషకషాయితవీక్షణంబుల
నాపక్ష్మలాక్షి నీక్షించి. 226

శా. "ఓసీ నీకొఱగామియే యిది నిజం బూహింప కిట్లంగజ
వ్యాసక్తుం డగునాథుచేష్టితము గా కైనం గుబేరుండు లేఁ
డో సుత్రాముఁడు లేఁడొ పద్మజుఁడు లేఁడో ధర్మపుంబ్రాపులే
దో సత్యంబును నిల్ప నింతన కడుం దుర్లంగ నీ కేటికిన్?"

క. అనిన విని నాయకాదర
ఘనగర్వము [1]నిరసనంబుఁ గడుఁ జిత్తములోఁ
దనరఁగ నవ్వులు కించుక
యును గైకొన కవ్వధూటి యుద్ధతిఁ బలికెన్. 228

క. అఱపు లుడిగి పోపో నీ
యఱచేతం బండ్లు వచ్చినప్పుడు మమ్ముం
గఱచెదవు గాని తగునెడ
మొఱయిడు మది యెట్టిదైవములు వినియెడినో. 229

వ. అనుటయు. 230

క. "కానిమ్ము వేగిరింపకు
నీనుదుటనె ప్రొద్దు వొడిచెనే యేదైవం
బైనను విన! కిప్పుడ యిదె
నానిజ మేర్పఱిచి నీకొనర్చెద శిక్షల్." 231

వ. అని పలికి యచ్చోటు వాసి కొన్ని యడుగు లరిగి యంతటఁ
దనకోపంబును మించి దీపించు ప్రియవియోగదర్పితానల్ప
కందర్పహేతిఘాతజాతచేతస్తాపంబున కోపక యాపడఁతి
కడుం గృశించి గళితకంకణ యగుచు నిలిచి యొక్కయుపా
యంబు చింతించి తిరిగి వచ్చి యి ట్లనియె. 232

1. నీరసంబు.

క. "నీ విచ్చో మెఱయఁత వై
కావరమున వలసినట్లు గయ్యాళింపం
గా వెఱచి [1]పెద్దమొఱ గా
నే వీరిని వారిఁ దగిలి యేల వచింతున్. 233

క. నీవును రా ర మ్మిప్పుడు
దేవసభం దేఱ యేగు దెంత" మనుచుఁ దా
నావనజాక్షిని డగ్గఱ
తీవరమునఁ గొంగుపట్టి తిగిచెం గినుకన్. 234

చ. తిగిచినఁ "జూచితే నిను మదిం గణియింపక యెంతసేఁతకుఁ
వెగినె భయంబుదక్కి పెను ద్రిమ్మరిరక్కసి గాక భూమిలో
మగువరె యీగయ్యాళి ? ప్రథమంబున నోర్చినతప్పు సూవె
యీ, పగిది ఫలించె ?" నంచుఁ బ్రియుఁ బల్కి గరం బది
సంభ్రమించుచున్. 235

క. పలికిన "మన కేమీ ? విబు
ధులసభలోపలన తనదుదుండగ మెల్లం
దెలిపి తగుశిక్ష చేయుట
మలిగి యిపుడు పదర నేల?" యని యతఁ డాడెన్. 236

తే. అంతఁ బ్రతిరంభ చూచి "నీయాత్మలోన
నింత యుండిన నీ[2]సత్త్వ మెఱుఁగవలయుఁ
దిరుగఁబడినను విడువఁ జూ! దేవసభకుఁ
బద" మనుచు దానిఁ గూడి పోఁ గదలుటయును. 237

వ. కొంత చింతించి యతనికాంత యతని కిట్లనియె. 238

---

1. పేద. 2. సత్య.

సీ. "అప్సరస్త్రీలలో నగ్రగణ్యత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీమేనకాద్యుత్తమస్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నేవారిచే బ్రేలఁ
జూపించుకొనక ప్రస్తుతికి నెక్కి
నలకూబరుండు ధన్యతరుండు నాఁగఁబు
వతనంబుచే నీకు వన్నె దెచ్చి
తే. యొప్పు[1]నే యింకఁ గడపట నిప్పిశాచి
నాకు సరిచేసికొని దేవలోకసభను
"నీవు నూ నీవు ను!" మ్మని యేవిధమునఁ
గలహ మాడెనే? నిది నీవె తలఁచిచూడు! 239
క. కోపము పాపమునకుఁ బొ
త్తీపెనుదగవునకుఁ దగఁగ నేటిట్లాటల్
ప్రాపించునో? పడంతుల
కోపురుషశ్రేష్ఠ యవియుఁ నొక్కప్రకటకులే? 240
వ. అదియునుం గాక. 241
క. "రంభకు నహాహా యొకప్రతి
రంభ గలిగి తిగిచి తెచ్చె రచ్చల!" కనినం
స్తంభింపనీరు హాస్యా
రంభణ మింపోరు నిర్జరవిట్టుల్ నగుచున్. 242
క. నానడకలకును యోగ్యము
కానిది యిపు డిచట [2]నైనకలహామ బ్రదుకె

1. నేనింక. 2. నైనఁగల.

